నవగ్రహాలలో – అంగారకుడు – అనబడే కుజుడు – అధిదేవత శ్రీ సుబ్రహ్మణ్యస్వామి. పైన చెప్పిన బాధలు, సమస్యలు కలిగినప్పుడు – ఒక్కొక్క రకమైన సమస్యలు, చిక్కు పరిస్థితులకు – ఆ సమస్యా స్వరూపాన్ని అనుసరించి ఒక్కొక్క విధానంగా ఆ యా గ్రహాలనూ అధిదేవతలనూ సంప్రీతులను చేయవలసివుంది. గ్రహాలు మణికుంతౌషధాలతోను, ఇతర విధాలైన అనేక సేవలతోను సంప్రీతులౌతారు. వారికి అధిదేవతలైన దేవతలనూ-సమస్యా స్వరూపాన్నిబట్టి-సంతృప్తులను చేయడానికి వేర్వేరు విధానాలున్నాయి.

మానవ శరీరంలో మూలాధారంనుండి సహస్రారం వరకు వ్యాపించి ఉన్న సుషుమ్నా నాడియే శ్రీ సుబ్రహ్మణ్యస్వామి కుండలినీ శక్తి అనే పేరుగల ఈ శక్తి-సర్పాకారం కలిగి ఉంటుంది. మానవుడు ప్రాపంచిక విషయాలయందు నిమగ్నుడై ఉన్నప్పుడు కుండలిని యొక్క శిరోభాగం మానవుని మూలాధారం వద్దనూ, పుచ్ఛం (తోక) సహస్రారం వద్దనూ ఉంటుంది. మానవుడు ప్రపంచంనుండి విముఖుడై అంతర్ముఖుడై యోగమార్గాన సమాధిగతుడైనప్పుడు – అతడి కుండలిని యొక్క శిరస్సు సహస్రారంలోను, తోక మూలాధారంలోను వుంటాయి. మానవుని సహస్రారంలో శివుడు నెలకొని ఉంటాడు. కుండలినీ రూపంతో ఈ సుబ్రహ్మణ్యస్వామి ఆయనకు పడగలు పట్టి ఉంటాడు. ఈశ్వరుడు భుజంగ భూషణుడు కావడంలోని అంతరార్థం ఇదే

ఐహికంలోని ఇష్టకామ్యాలను ప్రసాదించే సుబ్రహ్మణ్యస్వామి – శుద్ధ జ్ఞానస్వరూపుడు, మోక్ష ప్రదాయకుడు, పరమ జ్ఞానదాయకుడు కూడా అయి వున్నాడు.

ఆయా జాతకులకు ఏర్పడిన సమస్యలు, కలిగిన పరిస్థితులను బట్టి – సుబ్రహ్మణ్యేశ్వరుని అర్చించే విధి విధానాలలో మార్పులు చేయవలసి ఉంటుంది. సమస్యా స్వరూపాన్ని బట్టి మాత్రమే ఏ దేవతలనైనా అర్చించే విధి విధానాన్ని నిర్ణయించవలసి ఉంది.

జాతకుల జాతకాన్ని బట్టి – ఆయా వ్యక్తులు అర్చించవలసిన దేవతలెవరో, వారిని ఏ విధానంగా అర్చించాలో నిర్ణయించాలి.

ఐతే – శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని ఆరాధించే విషయంలో చాలా నియమ నిష్ఠలు అవసరం. ఏ మాత్రం అనాచారమూ జరగకుండా జాగ్రత్త వహించాలి. అప్పుడే సుబ్రహ్మణ్యేశ్వరునికి అనుగ్రహం కలుగుతుంది.